# విషయసూచిక

# భువనవిజయ నాటక నాందీప్రస్థావనలు

## సభాప్రాంగణము – ప్రథమాంకము

అప్పుడు : తిమ్మా ! ఇంత పెందనాడే దగెసేసినావు ఏందిరా కత

తిమ్మడు : నీకు తెల్దేట్రప్పుడూ యీయాలమన బోనిజ్జం చబకు పెద్ద పెద్ద పండితులోళ్లు ఒత్తంరంట. మన అట్టదిగ్గజ కయిసుల్తో ఓదాలాడతారంట–ఓదాలు

అప్పుడు : నాయాల్ది అనాగయితే యిన్నీల్రా పండితులోళ్ల పెనుగులాట–మాయిదిగుంటదినే

తిమ్మడు : మరేటనుకున్నవురా మనపెబువులోరు చమత్తలిత్తే మాబలేసెబుతారు గందాపండితులోళ్లు చవతకారవంటే శవతకారవేరప్పా ఇన్నీరాల, నేకపోతే జనమెందుకులే

అప్పుడు : మరిగయితే నెగ్గినోళ్లకి

తిమ్మడు : బవుమానాల్రా అప్పా ! బవుమానాలు అచ్చరలచ్చలు అచ్చరలచ్చలు

అప్పుడు : తిమ్మా మన పెబువులోరు సీకుట్టరాయలోరి సేతికెమికేనేదురా ! మనసొచ్చినంత

తిమ్మడు : మరేటనుకున్నవురాప్పా ! పెబువులోరిదయ ! ఎదుటోడి అదురుట్టం.
మరి పండితులోళ్ల పెసంగాలు పెనుగులాట్లు నీ కర్ద మవుద్దిరప్పా ?

అప్పుడు : ఏంటన్నావు పెబువుకోరి కూడు పండితులోళ్ల కొలువు ఆపాటితెల్దేటిరా తిమ్మా అంతా అగద్దమవుద్ది

తిమ్మడు : ఇంటూంటే మనకీ ఒత్తాదిరా కయిత్తం. పండితులోళ్లు నోరిప్పితే కయిత్తంరా
నా మీనో పగిదం పలికించుకోవాల్నుంది రప్పా సాన్రోజుల్నుండి.

అప్పుడు : అనగయితే మెల్లిగడగరా తిమ్మా ! మన రామలింగకవిగోరొత్తన్రు

అప్పుడు – తిమ్మడు : దండాలు బాబు దండాలు

రామలింగకవి : శుభమస్తు

తిమ్మడు : బాబూ బాబూ

రామలింగకవి : ఆ !

తిమ్మడు : బాబూ బాబూ

రామలింగకవి : ఊ ! ఆ అడిగేదేదో అడక్కూడదూ? నసక్కపోతే

అప్పడు : మీ పగిదేలిని మాయిదయిపోతుండు బాబూ మా తిమ్మడు

తిమ్మడు : ఏమీనేదుబాబూ తవరు పండితులోరు (కోపగించకండేం) నా మీనొకపగిదం ........ ఇనాల్నుంది బాబూ

రామలింగకవి : అయితే విను.

వాకిలికావలి తిమ్మా / చేకురు చేడియ సుఖములు సీఘ్రమె పొమ్మా

తిమ్మడు : మీ కేమిత్తును సుమ్మా !

రామలింగకవి : నాకీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా – (తిమ్మని వీపుపై నున్న పచ్చడమును అందుకొని పోవును)

అప్పడు : ఓరి తిమ్మా ! నీకూ ఒచ్చిందిరోయి కయిత్తం

తిమ్మడు : మరేటనుకున్నావు తిమ్మా, పండితులోళ్ల కొలువంటే

పచ్చుల పచ్చడం పట్టుకు పోయింద్రప్పా

అప్పడు : పోతే పోనాదిలే – పెబువులోరిచ్చిందే గదా

ఓరితిమ్మోయి మహామాత్తులోరు, తిమ్మరుసుగోరూ, పండితులోళ్లు అంతా వచ్చేత్తున్రురా

అప్పడు – తిమ్మడు : మా మాత్తులొరికి – దండాలుబాబు దండాలు

పెద్దపండితులు పెద్దనగారికి – దండాలుబాబు దండాలు

ముక్కు పండితులు తిమ్మనగారికి – దండాలుబాబు దండాలు

మాదయగారి మల్లనగారికి – దండాలుబాబు దండాలు

బట్టు పెబువులు బట్టు మూతి గారికి – దండాలుబాబు దండాలు

అడ్డబొట్టు పండితులు దూజటి గారికి – దండాలుబాబు దండాలు

సరసకవులు సూరన గారికి – దండాలుబాబు దండాలు

రమణ కవులు రామభద్రుడు గారికి – దండాలుబాబు దండాలు

(అందరును వారి వారి ఆసనములలో కూర్చొందురు)

## రాయలవారి రాక

(తెరలో) : బహుపరాక్‌లు – ఎదుట ఆట పాట

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ రాజాధిరాజ | రావేర | – | రణతంత్రధీర | నీవేర |
| మార్తాండతేజ | రావేర | – | తేజప్రతాప | నీవేర |
| మహామండలేశ్వరా | రావేర | – | మూరురాయరగండ | నీవేర |
| తుళువాన్వయాబ్ది సోమ | రావేర | – | జగనొబ్బగండ | నీవేర |
| సారస్వత ప్రియ | రావేర | – | లలిత కళానిలయ | నీవేర |
| భూపేంద్రసాంద్ర | రావేర | – | భువనైక తేజ | నీవేర |

నాగాంబికా నరసరాయతనూభవ నీవేర

వీరవైష్ణవ ప్రవర తాతాచార్య గురుజన సంభావ్యమాన నీవేర

ఆంధ్ర భోజ ! నీవేర ! విజయనగర సామ్రాజ్యాధీశ్వర కావేర

శ్రీశ్రీశ్రీ శ్రీకృష్ణరాయసార్వభౌమ కావేర రావేర

అందరు : లేచి నిలుచుండి ప్రణామములు

రాయలు : సింహాసనాశీనులగుదురు

### ఆశీ:పూర్వక ఉగ్గడింపు

పెద్దన : శ్రీభూదైవత భోగభాగ్య కవితా సింహాసనారూఢ తే
భూభర్తన్ రమణీయ శోభనకరున్ మోహాన తీండ్రించుచున్
సద్బంధుత్వత చేరవచ్చి నిలచెన్ సారస్వతా ప్రీతిమై
ఆ భోగేంద్రుని కృష్ణరాయదయితుం ఆంద్రోర్వి కీర్తింపదే

తిమ్మన : కవివతంసులచేత ఘనకీర్తి వెలిగొంద / భువన విజ్య సభను పొందుపరచి

మల్లన : చెలగి తుర్ష్కుల నెల్ల జీరాడి హైందవ / శాంతి దాంతులనెల్ల చక్క జేసి

దూర్జటి : దిగ్దంత వాజితొ దిగ్విజ్య యాత్రల / రాజేంద్ర విస్ఫూర్తి రాన కెక్క

భట్టుమూర్తి : విశ్వ విఖ్యాతిమై విజయనగర రాజ్య / మేక ఛత్రమ్ముగా నేలనౌర

సూరన : సంతతానంద వైభోగ సార్వభౌమ

రామభద్రుడు : కృతులనెన్నిటి కొంటివో కోర్కెమీర

రామలింగడు : కృపలు దొరలెడు మృదుశీల కృష్ణరాయ

అందరును : శాశ్వతమ్మౌగ నీకీర్తి సర్వ జగతి

## రాజకీయ సభావిషయములు

## సభాప్రాంగణము – ద్వితీయాంకము

రాయలు : అమాత్యా ! అప్పాజీ !

తిమ్మరసు : ప్రభూ !

రాయలు : విశ్వనాధుని విషయములేమైనా ......................................................

తిమ్మరసు : రహస్య చారులను వెనువెంటనే పంపియున్నాను. ఈ వరకు రావలయునుగా చూచుచున్నాను ప్రభూ !

దౌవారికుడు : (ముందునకు వంగి నమస్కరించుచు) ప్రభూ ! ఎవరో మొగశాల తమ ఆజ్ఞకై వేచి ఉన్నారు ప్రభూ !

తిమ్మరసు : తక్షణమే ప్రవేశపెట్టుము

దౌవారికుడు : చిత్తము ప్రభూ ! (వెడలును)

చారుడు : (లోనికి వచ్చి నమస్కరించుచూ) ప్రభువులకు నమస్కారములు

తిమ్మరసు : నిగూఢగుప్తా ! వచ్చితివా !

చారుడు : మహామాత్యులకు వందనములు

రాయలు : విశ్వనాధుని నుంచియా ?

చారుడు : చిత్తము ప్రభూ ! ఇదిగో లేఖ (అందించును) సెలవు ప్రభూ

తిమ్మరసు : (లేఖను చూచుచు) విజయము ప్రభువులకు

రాయలు : చదువుడప్పాజీ

తిమ్మరసు : శ్రీమన్మహామండలేశ్వరా విజయనగర సామ్రాజ్యాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములవారి దివ్యపాదారవిందములకు ప్రభు భక్తి వినయ విధేయుడు విశ్వనాధుడు ప్రణామములు మహా ప్రభూ !

మీ ఆజ్ఞమేరకు మామాట నిలబెట్టుకొన గల్గునట్లు, మా తండ్రిగారైన నాగమనాయకులవారు బందీలుగా కొనిరాబడుచున్నారు

ఇట్లు – ప్రభుభక్తివినయ విధేయుడు – విశ్వనాధుడు

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : ప్రభూ !

రాయలు : విశ్వనాథులు వచ్చుసరికి

తిమ్మరసు : సన్మానమేర్పరుపుడని వేరే చెప్పవలయునా ప్రభూ ! అటులనే

## రాణివాసపు లేఖ

లేఖిని : వంగి నమస్కరించుచు ముందునకు వచ్చుచు (చేతిలో పత్రముండును) ప్రభువులకు లేఖిని నమస్కారములు

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : లేఖినీ ఇటు తెమ్ము

లేఖిని : మహామాత్యులకు వందనములు (అందించును)

రాయలు : దేవేరుల మందిరము నుండియా ?

తిమ్మరసు : ఔను ప్రభూ ! (లేఖను చూచుచు) అటులనే ప్రభూ !

రాయలు : ఏమని అప్పాజీ !

తిమ్మరసు : ప్రభువుల దిగ్విజయ యాత్రావిషయములు తమతోపాటు ఆంధ్రోర్వి ఎల్లరు విన కీర్తింప జేయుడని

రాయలు : ఆ .................................... అటులనా ................................

తిమ్మరసు : రాణివారిమాట రాజాజ్ఞకాదొకో !

రాయలు : తప్పతరముకాదొ తధ్యమగునొ ?

మల్లన : సీతవెంటగొనడె శ్రీరామచంద్రుండు

తిమ్మన : దేవతర్వుదేడె దేవదేవ్వు

## దిగ్విజయ కీర్తనము

పెద్దన : విజయ భేరులు మ్రోగ – వీరవిక్రములార

కదన భూమికి రండు – కదలాడి గుమిగూడి

ప్రభువు రాయలవారి – ప్రఖ్యాతిగనరండు

జనులార ఘనులార – జగదేకవిభులార

రారండహో కృష్ణరాయల కీర్తి వినరందహో

వీరతిలకము బెట్టి వీరహారతులంది

ఖడ్గబల్లెము డాలు ఘనమైన విల్లంబ్లు

రంగైన ఫీరంగ్లు పొంగార రణభూమి

వీరవిక్రముసల్పి విజయ దుందుభి మ్రోయ

వినరండహో విజయసింహములార కనరండహో

తిమ్మన : దేవరాయల దండు దేవేంద్ర తుల్యంబు

కార్చిచ్చులారేగి క్రమ్ముకొనునల్గడల

రథసేన గజసేన రణభేరిదుందుభులు

తురగాది రోహకులు తులలేని కాల్బలము

ఎగరేసి జెండాలు ఎదురేమి లేదంచు

చాటండహో విజయ శంఖము మ్రోయ వినరండహో

ఉదయగిరి దుర్గమ్ము నుధృతిందెగనాడె

చంద్రగిరి రాజేంద్రు చెండాడి రణభూమి

అరిగాపిబంటులై అందందు పర్విడగ

లేలెండహో రణభేరి మ్రోయించి తరలండహో

దూర్జటి : వినుకొండ పెనుగొండ వీర్యంబణంగొట్టి

సింహపురి చెన్నూరు చిత్రగిరి దుర్గముల

లేవెల్గురాత్రుల లోలోన మునిముట్ట

తరలండహొ ఘనులార వెడలండహో

కాళహస్తిక్షేత కొమరారు దైవాల

తీర్ధ పాలాభిషేకాల తేలించి ప్రభ గొన్న

కృష్ణరాయల కీర్తి కనరండహో వినరండహో

మల్లన : ఎదురొడ్డి నిలబెట్టు ఎంతేని ఘనులైన

కొండవీటి రెడ్ల కోరలే విరిచెరా

కనకగిరి దుర్గమ్మ కొమరారదనియించి

కుంకుమాహారతుల ఘుమఘుమారావాలు

ఘనముగా పచరించి కరములే జోడించె

కృష్ణరాయల కీర్తి తెలియండహో వినరండహో

రామభద్రుడు : చల్లపిల్లినిడించి జమ్మి తుమ్మి కోన్ల

చల్లంగ దిగ మింగి చల్దిగాలెక్కించి ఘనమైన గోదారి కడతేగ నెదురేగి

మాని కట్టలు కట్టి మున్నీటి నెరుగొన్న

గల గలా రావాలు జగమెల్ల వినిపింప

రారండహో ఘనులార కృష్ణరాయల కీర్తి వినరండహో

పింగళి సూరన: గోదావరీ తీర గోఘుత్సాఘుల ఘ్రాణ వేదవిద ఘోషలే వినరండి తరలండి

ద్రాక్షారామ భీమ క్షేత్రాన వసియించి గౌతమీ ఘనసీమ కొమరారు ఫలసిద్ధి

తినరండహో వినరండహో జనులార కనరండహో

రామరాజ భూషణుడు : మన్నెదుర్గాలైన మాడ్గులా వడ్డాది

కొల్లగొట్టిన కోట్లు కొల్లలుగ చేకొన రారండహో విజయరాయల కీర్తి వినరండహో

సింహాద్రి కటకాన గజసేన కెదురౌచు గజపతుల నెదుర్కొన్న

కృష్ణరాయల కీర్తి చాటండహో వెడలండహో తరలండహో

తెనాలి రామలింగడు : నారసింహుని గొల్చి నయనాభిరామమౌ సింహాద్రి అప్పన్న చేరి గొల్చిన తీరు

విజయ చిహ్నముగా విను వీధి కెక్కగా పొట్నూరు స్తంభాన ప్రభ వెలుగ చాటంగ

కృష్ణరాయల కీర్తి వినరండహో తరలండహో

కదన భూమిని జేరి కదలండహో కదలండహో రారండహో ఆంధ్రజనులార వినరండహో

దేవేరుల రాణివాసమునుండి దిగ్గజకవులెల్లరకును లక్ష వరాల పళ్లెర ప్రదానము

## తృతీయాంకము – కవిగండపెండేరము

తిమ్మరసు : (సభాప్రాంగణము) ప్రకాశముగా

మహాజనులారా పండిత ప్రవరులారా ఇదే మన ప్రభువులు శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములు నేడు భువనవిజయ పారితోషికముగా ఒసంగనగు కమనీయ రత్నాలంకృత సువర్ణమయ కవిగండపెండేరము (చూపుచూ) సంస్కృతాంధ్రములందు సమపాళి ఆసువుగా **'కవనముం'** జెప్పి ప్రభువుల మెప్పించి ఈ బహుమానమును తొడిగించుకోవలసినదిగా ప్రభువులవారిచే కోరబడుచున్నారు.

కవి ప్రవరులు : (తమలో తాము ఒకరి వంక ఒకరు తమలో చూచుకొనుచూ)

(తమరు – ఉహూ కాదు తమరు – ఆహా తమరు – కాదు తమరు – తమరు) అనుకొనుచుందురు

రాయలు : అప్పాజీ ! ముద్దుగ గండపెండిరియముం కొనుడంచు బహూకరింపగా

ఒద్దిక నాకొసంగుడని ఒక్కరు ముందుకురారు లేరొకో ?

పెద్దన : పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీవెరుంగవే

పెద్దన కీదలంచినను పేరిడి నాకిడు కృష్ణరాణ్నృపా (అని ముందునకు వచ్చి )

ప్రభూ ! కవన వస్తువును గురించియే ఐన వినుండు ( కవనము అనునది ఈ విధముగా ఉండాలి అంటూ)

పూతమెరుంగులుం బసరు బూపబెడంగులు జూపునట్టి వా
కైతలు జగ్గు నిగ్గు నెనగావలె, గమ్మన ఘుమ్మనంవలెం
రాతిరియుంబవల్ మరపురానిహొయల్ జెలియారజంపు ని
ద్దాతరి తీపులంబలెను దారసిలంవలె లోదలంచినన్
బాతిగబైకొనంవలెను పైదలి కుత్తుకలోని పల్లటీ
కూతలనన్ వలెన్ సొగసు కోర్కులు రావలె నాలకించినన్
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దుల గుమ్మ కమ్మనౌ
వాతెర దొండపండువలె వాచవిగావలె పంటనూదినన్
గాతల తమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బె పు
న్నేమ్మైలి అబ్బురంపు బిగి నిబ్బరపుబ్బగు గుబ్బి గుబ్బ పుం
బూతల నున్న కాయ సరిపోడిమి కిన్నెర మెట్ల బంతి సం

గాతపు సన్నతంతిబయగారపు కన్నడ గౌళ పంతు కా
సాతత తానతానల పసందివుటాడెడు  గోటమీటుబల్
మ్రోతలునుంబలెం హరువు మొల్లముగావలె నచ్చతెల్గులీ
రీతిగ సంస్కృతంబు పచరించిన పట్టున భారతీవధూ
టీ తపనీయ గర్భనికటీభవ దానన పర్వసాహితీ
భౌతిక నాటక ప్రకర భారత భారత సమ్మత ప్రభా
సీత నగాత్మజా గిరిజ శేఖర సీత మయూఖ రేఖి కా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మలయ సంగతి చుంచు విపంచికా మృదం
గాతత హేతి తత్త హిత హాదిత ధం ధను దాణు దిం ధిమ
వ్రాతనయానుకూల పదవార కుహూద్వహ హార కింకిణీ
నూతన ఫుల్లలాచరణ నూపుర ఝూల ఝళీ మరంద సం
ఘాత వియద్ధునీ చక చక ద్వికచోత్పల సార సంగ్రహా
యాత కుహార గంధవహ హారి సుగంధ విలాస యుక్తమై
చేతము జల్లజేయవలె జిల్లన  జల్లన నం మనోహర
ద్యోతక కోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతి రసప్రసార రుచిర ప్రతిమంబుగ సారె సారెకున్

రాయలు : భేష్ ! పెద్దన కవీంద్రా భేష్ ! (గండపెండేర మందుకొనును)

(సభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టుచుండును)

తిమ్మరసు : పెద్దన కవీంద్రా ఇదే ఇటు రండు

పెద్దన : ప్రభూ ! మన్నింపుడు. అటు కాదు ఇటు ఎడమ కాలికి

(సభలో చప్పట్లు) – పెద్దన కవీంద్రునకు జై

ఆంధ్రకవితా పితామహులకు జై

శ్రీకృష్ణరాయ సార్వభౌములకు జై

<u>పండితాభిప్రాయ సేకరణ</u>

రాయలు : సభా సదులారా కవి దిగ్గజములారా ! పండిత ప్రవరులారా ! పెద్దన కొసంగబడిన ఆంధ్రకవితా పితామహ కవి గండ ె
ఎం దేర సన్మానమును గురించిన మీ మీ అభిప్రాయములు విన నభిలషించుచున్నాను (సభలో ఎవరును మాటాడకుందురు)

తిమ్మరసు : ఎవరైనను ఏమైనను తమకు తోచిన విషయములు నిర్భయముగా వినిపించవచ్చును. ప్రభువులే స్వయముగా

అడుగుచున్నారు కదా సందేహింపవలసిన పని లేదు

రామలింగడు : పెద్దన వలె కృతి చెప్పిన / పెద్దన వలె. అల్పకవిని పెద్దన వలెనా

ఎద్దనవలె మొద్దనవలె / గ్రద్దనవలె కృష్ణరాయ రాజమహేంద్రా

రాయలు : లెస్స బల్కితివి రామలింగ కవీ ! లెస్స బల్కితివి

రామలింగడు : అలవడిన కవన పద్ధతి / తలపింపుల కూర్చుటొప్ప తగదే కవికిన్

రాయలు : కలనాటి ధనములక్కర / గలనాటికి దాచ కమల గర్భుని వశమే ?

పెద్దన : నెలనడిమినాటి వెన్నెల / అలవౌనే దాచబెట్ట అమవస నిశికిన్

రామలింగడు : మామా ! ఎమిదిని సెపితివి కపితము / భ్రమపడి వెరిపుచ్చకాయ వడిదిని సెపితో

ఉమితః కయదిని సెపితో / అమవస నిశి అన్నమాట అలసని పెదనా

రాయలు : ఏమీ ! పొరపాటున దొర్లిన శబ్ద దోషమునకే ఇంత పరి హాసమా ? రామలింగ కవీంద్రా !

అట్లేని శ ష లు లేకుండ ఒక కందమును చెపుడు చూతము

తిమ్మరసు : రామలింగ కవీంద్రా ! అదియును ప్రభువులు శ్రీకృష్ణరాయలవారి కీర్తినే ఉగ్గడించవలెను సుమా

రామలింగడు : ప్రభూ ! తమ నామధేయమున శ ష లు ఉన్నవనియే కదా మహామాత్యులిట్లు సెలవిచ్చిరి

ఐననేమాయె. (అని ఒక నిముసమాలోచించి)

ధరనేలు దేవరాయల / కరమరుదగు కీర్తికాంత కరిభిత్ గిరిభిత్

కరి కరిభిత్ గిరి గిరిభిత్ / కరిభిత్ గిరిభిత్తురంగ కమనీయంబౌ

రాయలు : శభాష్ రామలింగ కవీంద్రా ! శభాష్ (ఇదే గైకొనుడు)

రామలింగడు : రత్నాల హారమా ప్రభూ ! ధన్యుడను. ప్రభువులు వదాన్యులు

రాయలు : రామలింగకవులు ఆప్పాజీ వారిని గురించియు ఒక పద్యమును చెప్పిన వినాలనున్నది. వినిపింపగలరు కదా

రామలింగడు : ప్రభువుల సెలవు ప్రకారము. అప్పాజీ వారు

వయసున పెద్దయౌ మరియు వాక్కులనన్య మనోహరంబులౌ / నయవిదుడౌగ వ్యూహ రచనా పరిపోషణ సంగరంబులన్

భయమది లేదు కార్య సముపార్జన మేరు సమాన ధీరుడౌ / దయగల మంత్రి తిమ్మరుసుదారగుణాఢ్యుడు ఎంచి చూడగను

తిమ్మరసు : చాలు ! రామలింగ కవీ ! చాలు.

కొండలు జేసి పల్కకుము కోవిదులెర్గత మంచి చెడ్డలున్ / మెండగు త్రోవలున్ బరుప మీదను నుండరె కృష్ణరాయలున్

రాయలు : పండితులైన వారు గద పావనమూర్తులు మీకు మీరలే / దండి గడింప సాటెవరు తక్కుల నందల బోల్ప జెల్లునే

తిమ్మరసు : సంతోషము ప్రభూ ! సంతోషము. మీ దయకు పాత్రుడనగుటయే మహద్భాగ్యము

రామలింగకవీ ! చంద్రునికో నూలు పోగుగా ఇది గ్రహింపుడు (ఇచ్చును)

రామలింగడు : సంతోషము మాహామాత్యా ! తమ ఉదారతకివే మా జోహార్లు. (ముత్యాల హారము)

తెరలో : శ్రీకృష్ణరాయ సార్వభౌములకు జై – తిమ్మరసు మహామాత్యులకు జై

## చతుర్థాంకము–సభాప్రాంగణము

**(భావజ్ఞపండిత చక్రవర్తుల రాక)**

దౌవారికుడు : ప్రభూ ! పండిత ప్రవరులెవరో వచ్చియున్నారు. ఇదిగో వారి లేఖ (అందించును)

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : (లేఖను చూచుచు) భావజ్ఞపండిత చక్రవర్తులా ! ప్రవేశపెట్టుము

దౌవారికుడు : చిత్తము. వెడలును (పండితులు వచ్చుచుందురు)

తిమ్మరసు : పండితోత్తమా దయచేయుడు

పండితుడు : (చేయెత్తి ఆశీ:పూర్వకముగా)

శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు / అస్తు రాయలకెపుడు ఐశ్వర్యమస్తు

భూరి వైభవతేజ భూపేంద్ర భోగ / దాన కర్ణుడవయ్య ధర దేవరాయ

తిమ్మరసు : భళా

పండితుడు : బృందారక లోకమ్మున / మందారమ్మును వెరచి మహికేతెంచెన్

పొందుగ రాయల రూపా / నందముగా దాల్చి ఇట్లు అర్థుల దనుపన్

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : కవి చంద్రమా ! ఇదే రాయల వారి పారితోషికము. గైకొని తమ వివరములు రాయలవారికి విన్నవించుడు

పండితుడు :

(పళ్లెరమందుకొని చూచుచు) వరాల మూటయా ప్రభూ ! నేనీప్రాంతమునకు క్రొత్తవాడను భావజ్ఞపండిత చక్రవర్తి

అందురు నన్ను. అనేకానేక ఆస్థానములలో జయ పత్రములందుకొంటిని. మీ ఆస్థాన పేరు ప్రఖ్యాతులు విని వచ్చి యున్నాను

రాయలు : ఐన, మా పండిత కవి దిగ్గజములతో పండిత వాదము నెఱపెదరా ?

పండితుడు : ప్రభువుల సెలవైనచో

రాయలు : అప్పాజీ ! అష్ట దిగ్గజ కవి చంద్రమా

తిమ్మరసు : అంతయు సిద్ధమే ప్రభూ !

దిగ్గజములు : సంసిద్ధులమే ప్రభూ

తిమ్మరసు : భావజ్ఞపండిత వర్యా ! తాము ముందుగా ప్రారంభింతురా ?

పండితుడు : అటులనే ప్రభూ ! ముచ్చటగా 3 , 4 విషయములు మాత్రమే

రాయలు : మీకు కావలయునన్ని ప్రశ్నింపుడు. మా దిగ్గజముల కడ్డేమియు నుండదు

పండితుడు : కవి దిగ్గజములారా. వినుండు

- నా – నీ – నే – చేయి – తామర – తోడ ఈ పదములతో సంభాషణాపూర్వకముగా కందము చెప్పుడు
- మామిడేల పూయు మండు వేసంగిలో, బాలుడేల పోవు పసుల వెంట,

  ధరణి నేల నేర్తు ధరణీశ చంద్రులు, మూటికొక్క మాటె ముదము బదులు

- కొండనుండు నెమిలి కోరిన పాలిచ్చు / పసువు శిశువు తోడ పలుక నేర్చు

  తల్లి మాత గాదు తనయుల పోషించు / బ్రాహ్మణుండు కాకి పలలము దిను (సబబా)

- (ఇక నాల్గవది అంటూ) రాయలవారి ముఖమువంక తేర్పార చూచుచు

  రాయల వారి మీసములపై ఒక పద్యమును చెప్పవలెను

రాయలు : పండితోత్తమా ఇంకను ఏమైనా ఉన్నవా ?

పండితుడు : ప్రభూ ! ఇంతియె చాలును. చెప్పగల్గిన విని సంతసింతును. ఆలోచించనిండు మీ దిగ్గజముల

తిమ్మరసు : దిగ్గజ చంద్రమా , కాల వ్యవధానమవసరమా

పెద్దన : అక్కరలేదు ప్రభూ అక్కరలేదు ఈ వ్యవధానమే బోలెడు

రాయలు :పెద్దన కవీంద్రా ! దిగ్గజ చంద్రమా ! పండితులతోపాటూ మమ్ములను కూడా ఆనందింపజేయుడు

పెద్దన : భావజ్ఞపండితోత్తమా ! తొలుత మా ప్రభువుల వారి మీసములపై పద్యమును ఒక్కొరము ఒక్కొక్క పాదమును చెప్పెదము వినుండు

పెద్దన : విజయనగర రాజ్య విభవంబునదియెల్ల / రాయల మీసాల రమ్య శోభ

రా భూ : అరికూట మదియెల్ల హడలెత్తి పర్వెట్టు / రాయల మీసాలు రాణకెక్క

తిమ్మ : చంచరీకపు దండు చయ్యన రొదజేయు / రాయల మీసాల రమ్యమెంతొ

దూర్జ : ముంగార చెలివార పొంగారు తను శోభ / రాయల మీసాలు రాయిడింప

మల్ల : ఆంధ్ర జాతీయ బహు కీర్తులవని మోయ

సూర : ఆది కూర్మమా ? శేషుడా ? అంబ బలమా?

రామ భ : కాదు కాదయ్య కనుమయ్య కర్మ యోగి

తె రా : కృష్ణరాయల మీసాల కృపయ సుమ్మ

తిమ్మరసు : భేష్ భేష్ దిగ్గజ చంద్రమా భేష్

భా పం : ఆ హా హా అందరకు నందరే. ఒకరికొకరు తీసిపోరు

రాయలు : నా – నీ – నే – చేయి – తామర – తోడ (దత్తపది) మీలో ఎవరు వినిపింతురు

సూరన్ : ప్రభూ ! ఎవరమైనను సరే మీ సెలవు.

రాయలు : అటులైన మీరలే వినిపింపుడు సూరన కవీంద్రా! ఆనందముగా విందుము

సూరన్ : నా – నీ – నే – చేయి – తామర – తోడ (కందం, సంభాషణ) ఒక నిముషమాలోచించి

నీ తామర నాకంటెను / నీ తోడుగ దీని బాధ నేబడజాలన్

చేతికి నావీపందదు / తాతా, నా వీపు గోకుతావా లేదా

రాయలు : భేష్ భేష్ ! సూరిజన సూరుడవయ్య సూరనార్యా

పెద్దన : ఇక మూటికొక్క మాట ఎవరిని తెలుపమందురు ప్రభూ

రాయలు : మల్లన కవీంద్రా! మీరు తెల్పుడు సంతోషింతుము

మల్లన : (ఆలోచించుచు)

మామిడేల పూయు మందు వేసంగిలో, బాలుడేల పోవు పసుల వెంట,

ధరణి నేల నేల్దు ధరణీశ చంద్రులు, మూటికొక్క మాట

కనగనొక్క మాట **కాయుటకును**

రాయలు : భేష్ భేష్ ! చాలా బాగుగా చెప్పితిరి మల్లన కవీంద్రా !

మామిళ్ల కాయుటకొరకే పూయును, పసుల కాయుటకొరకే బాలురు వెంటనుందురు

ప్రజల కాచి రక్షించు కొరకే ప్రభువులు నెలకొందురు

ఇక మిగిలినది మీరు రామభద్ర కవీంద్రా !

రా భ : చిత్తము ప్రభూ !

కొండనుండు నెమిలి / కోరిన పాలిచ్చు పసువు / శిశువు తోడ పలుక నేర్చు తల్లి

మాత గాదు తనయుల పోషించు బ్రాహ్మణుండు / కాకి పలలము దిను.... అన్నియు సబబేగదా

భా పం : ప్రభూ ! మీ కవీంద్రులందరును నిజముగా దిగ్గజములే

తిమ్మరసు : ఇక మీకు పరీక్ష పండితవర్యా ! సిద్ధమేనా ?

భా పం : సిద్ధమే ప్రభూ !

రాయలు : పెద్దన కవీంద్రా ! ఒకటి రెండు విషయములతోనే సరిపెట్టుడు

పెద్దన : తమ సెలవు ప్రకారమే ప్రభూ ! రామభద్రకవీంద్రా మీరేనీ ప్రశ్నింపుడు వీరిని

రా భ : పండితవర్యా ! మా ప్రశ్న వినుండు

కొమ్మలందు వంద కోతులు ఉన్నాయి / ఒక్క మీట క్రింద నొక్క గానె

బాంబు పేలి కింద పడియెను పండ్రెండు / కొమ్మలందు ఇంక నెమ్మి మిగులు

భా పం : అసలె కోతులవ్వి అన్నిటికీ మించి / వేరె గాక బాంబె పేలియుండ

కొమ్మలందు నిలువ బొమ్మలా తెలియుమా / ఒక్కటుండబోదు ఒట్టు సుమ్మ

రాయలు : భేష్ భేష్ !

భా పం : ఇక రెండవది ప్రభూ !

పెద్దన : పండిత కవివర్యా వినుండు.

పెద్దన : రాముడేమూకతో రావణు మర్ధించె ? ( తోక మూకతో )

తిమ్మన : వరరంగ వైభవువాడయెద్ది ? ( రంగనగరం )

దూర్జటి : అలకాపురీరాణ్కి అనువైన దండేది ? ( మందారదామం )

రా భ : జగన్నాధుడెద్దాంతొ జేయబడియె ? ( చెక్కముక్కచె )

రా భూ : సీత పెళ్లికి నోలి చేసిన విల్లేది ? ( పంచాశ్యచాపం)

మల్లన : కమ్మగా నవ్వించు కవి ఎవండు ( వికటకవి )

సూరన : శ్రీకృష్ణుడేయింట చెలగి పర్వులు వెట్టె ( నందసదనం )

తె రా : బీరగాజెప్పనౌ బీజమెద్ది ( జంబీరబీజం)

పెద్దన : అరయదెలియుమ ఐదేసి అక్షరములె / ముందువెనుకల ఒక విధముండు చదువ

చెప్పగలవయ్య భావజ్ఞపండిత చక్రవర్తి / చెప్పలేకున్న ఈ సభఁ చిన్నబోదు

భా పం : అటునిటు చూచుచు ఆలోచించుచూ (తల గోకుకొనుచు) తెల్లమొగము వేసి చూచుచు

ప్రభూ ! తమ దిగ్గజముల ముందు తలవంచక తప్పదు

సభలో : అష్టదిగ్గజ కవీంద్రులకు జై ! భువన విజయ సభకు జై ! శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములకు జై !

రాయలు : పండిత వర్యా ! మీరును తక్కువ వారు కారు. అమాత్యా అప్పాజీ !

తిమ్మరసు : కవి దిగ్గజములారా ! మీ కందరకును ప్రభువులు శ్రీకృష్ణదేవరాయలు వారు భువన విజయ కానుకలుగా అక్షర

లక్షతాంబూల పళ్లెరముల నొసంగుచున్నారు. వచ్చి గ్రహింపుడు

రాయలు : భావజ్ఞపండిత చక్రవర్తులకు గూడను

భా పం : ప్రభూ ! నాకును గూడనా ?

తిమ్మరసు : కవీంద్రా ! రాయలవారిని దర్శించి వట్టి చేతులతో వెడలువారుండరు. వచ్చి గ్రహింపుడు

భా పం : ప్రభువుల వదాన్యతకును ఔదార్యమునకును ఇవే మా జోహార్లు. (అని నమస్కరించును)

(పండితులందరును వచ్చి ఒక్కొక్కరును తాంబూల పళ్లెరముల నందుకొందురు)

సూరన :		కృష్ణక్ష్మా నాయక శ్రీ / కృష్ణ ధ్యానామృతాబ్ధి ఖేలన లీలా

కృష్ణ జ్ఞాననయా వహ / దృష్ణ ర్బాహాబలావధీరిత భీమా !

## పంచమాంకము

### సమస్యాపూరణ(ము)లు–సభాప్రాంగణము

(రాయల వారు పండితులు కూర్చొనియుందురు)

తిమ్మరసు : మహాజనులారా ! విద్వత్ ప్రవరులారా ! సావధానులు కండు. ప్రభువులిచ్చు సమస్యలను మన కవి దిగ్గజ పండితులు పూరింతురు.

రాయలు : రామభద్ర కవీ ఈ సమస్య వినుండు. **మగని జడలోన మందార మాల ముడిచె** (2 సార్లు చదువును)

రా భ : (ఆలోచనామగ్నుడై)

కుసుమ గుచ్ఛంబులొక కొన్ని కొన్న మగడు / ప్రేమ మీరంగ నెంతయో ప్రియముతేగ

పొలుపు జెలువార గదిలోన పూల గుమగు / మ గని జడలోన మందార మాల ముడిచె (2 సార్లు చదువును)

రాయలు : బాగు బాగు. మల్లన కవీంద్రా ! ఇదే సమస్యను మీరలు పూరించుడు చూతము

మల్లన : (కొంత తడవాలోచించి)

కలికి తనమేన జవ్వాది కలయ నలది / తగగ పన్నీట నీరార్చి దట్టి గట్టి

తనదు సొమ్ములు నునుమేన దాల్చి / గనియు, మగని జడలోన మందార మాల ముడిచె (2 సార్లు చదువును)

రాయలు : శభాష్ మల్లన కవీంద్రా ! శభాష్. ఇక దూర్జటి కవీ, మీరలు వినుండు

**శ్రీనాధుండు రచించె భారతము నిస్సీమ ప్రభావోన్నతిన్** (2 సార్లు చదువును)

దూర్జటి : (ఆలోచించుచూ)

నానానేక సమంచితాఖిల సమున్నతాధిక్య కావ్యోన్నతిన్ / తానాధిక్యుడుగా జగాన కవితాధౌరేయుడైయొప్పు యీ

శానాంతర్గత బాహ్యతేజ కవితా శాస్సుండు గాకే యశ: / శ్రీనాధుండు రచించె భారతము నిస్సీమ ప్రభావోన్నతిన్

(2 సార్లు చదువును)

రాయలు : ఆహా ! ఏదీ మరియొకమారు దూర్జటి కవీంద్రా !

దూర్జటి : (మరలా చదువును) నానానేక ......................................................................................ప్రభావోన్నతిన్

రాయలు : అమోఘమమోఘము దూర్జటి వరేణ్యా ! మీకు మీరలే సాటి. మూర్తి కవి వరేణ్యా ! మీరలు వినుండు

**కవి ఒక్కండును కానరాడు ధరణీ ఖండంబునందద్దిరా** (2 సార్లు చదువును)

భ మూ : ఒక్కింత తడవాలోచించుచు

సువిశాలంబగు సాహితీరమణ భాషోద్యాన వాటీతటిం / కవిభాస్వంతమునెంచుచో విభుధ లోకాఖ్యాన సంసేవ్యు డా

రవి తేజ: సము కాళిదాస్నుకెనయౌ రమ్యుండితండోయనం / కవి ఒక్కండును కానరాడు ధరణీ ఖండంబునందద్దిరా !
(2 సార్లు చదువును)

రాయలు : ఏదీ భూషణ కవీంద్రా ! మరియొక్కమారు

రా భూ : (మరలా చదువును) సువిశాలంబగు.................................................................. ధరణీ ఖండంబునందద్దిరా !

రాయలు : ఏమి, ఈ పద గుంభన పాటవము.శభాష్. ఇక తిమ్మన కవీంద్రా ! మీరు వినుండు

**తిమ్మన తాను వ్రాసి వినుతింగనె రాఘవ పాండవీయమున్** (2 సార్లు చదువును)

ముక్కు తిమ్మన : (కొంచెమాలోచించుచు)

ఇమ్ముగ ద్వ్య ర్థి కావ్య మొకటెవ్వరు వ్రాయగ లేరొకోయనం / వమ్మయి పెద్దనార్య కవి వర్యుడు దూర్జటీ రామకృష్ణుడుఁ

గమ్ముగనున్న సూరకవి గండడు మద్దెల మ్రోవగా తధిం / ధిమ్మన తాను వ్రాసి వినుతింగనె రాఘవ పాండవీయమున్

(2 సార్లు చదువును)

రాయలు : అయారే ! తిమ్మనా మాత్యా ! మీ ఆశువు సమయోచితమును అమోగమును. ఏదీ మరియొకమారు

ముక్కు తిమ్మన : (మరలా చదువును) ఇమ్ముగ ద్వ్య ర్థి ......................................................... రాఘవ పాండవీయమున్

రాయలు : ఇదే సమస్యను మీరలు సూరన కవీంద్రా ! ఎట్లు పూరింతురో చూతము మరి

సూరన : ఇమ్మిహి కృష్ణరాణ్నృపతి ఇంపని సొంపని సంతసింపగా / కమ్మని పారిజాతతరుగాధను దీప్తి చెలంగ నెంతయో

తిమ్మన తిమ్మన తాను వ్రాసి వినుతింగనె; రాఘవ పాండవీయముం కమ్మగ సూరనార్య కవి గండడు రాసె వింత గూర్చచ
ఎన్

(2 సార్లు చదువును)

రాయలు : భళిరా సత్కవివౌదువే కదా ! సూరన కవీంద్రా ! భళి. ఇక రామకృష్ణ కవీంద్రా !మీరు వినుండు

**ఈతాకుల గుడిసెలోన ఇనుడుదయించెన్** (2 సార్లు చదువును)

రామలింగడు : సీతాపతి పూతోటకు / యాతామెత్తంగ వలయు వేకువ ఝామున్

తాతా తొంగున్నావా / ఈతాకుల గుడిసెలోన యినుడుదయించెన్

రాయలు : ఆహా ! ఏమి సరళము. సమయోచితము. సౌకుమార్యము. రామ కృష్ణ కవీ ఉచితజ్ఞుడవయా.ఇది వినుండు

**పాలను విడి యతడు క్షీరపానము జేసెన్** (2 సార్లు చదువును)

భాగవత పరంగా కవీంద్రా !

రామలింగడు : ప్రభూ ! భగవత్ భాగవత పరంగానా. అటులనే ప్రభూ ! (కొంచెమాలోచించి)

ఆలం మేపుచు హరి గో / పాలురు కొమ్మచ్చులాడ బలరామునికిన్

తెల్లని తియ్యని వెన్న / ప్పాలను విడి యతడు క్షీరపానము జేసెన్ (2 సార్లు చదువును)

రాయలు : లెస్స బల్కితివి కవీంద్రా ! లెస్స బల్కితివి. ఇక పెద్దనామాత్యులు మిగిలి ఉన్నట్టున్నారు కదా. కవీంద్రా ! వినుండు

**ఏకాదశి నాడు సప్తమేడే ఘడియల్** (2 సార్లు చదువును)

పెద్దన : అర్థ ఘడియాలోచించి

శ్రీ కాంతుని దినమెయ్యది ? / రాకొమరునకేది ప్రియము ? రవి తిథి యెన్నం ?

డే కొలది జీర్ణమగు కడి ? / ఏకాదశి నాడు సప్తమేడే ఘడియల్

(2 సార్లు చదువును)

రాయలు : ఇది క్రమాలంకారము కదా పెద్దనా మాత్యా !

పెద్దన : ఔను ! ప్రభూ !

తిమ్మరసు : ప్రభూ ! మన్నింతురు గాక.

రాయలు : ఏమది అప్పాజీ విన్నవింపుడు

తిమ్మరసు : మిగిలియున్నవారలిప్పుడు ప్రభువులే

రాయలు : అటులైన ఏదేని సమస్య నిండు అప్పాజీ

తిమ్మరసు : (ప్రభూ ! గ్రహింపుడు) **నాతులు మీసముల్దనరి నవ్వత జూపరె పూరుషార్భటిన్** (2 సార్లు చదువును)

దిగ్గజములు : ప్రభూ ! పురాణార్థముగా పూరించ వేడుచున్నారము

రాయలు : (కొంత తడవాలోచించి) వినుండు. – కృష్ణ నిర్యాణానంతరము

ఆతరి దైవ యోగ గతి అచ్యుతు భార్యలన్లెరం విశే / షాతి శయోద్ధతిం తగగ స్నానము చేయను భద్రుడంపగా

జాతర తండమోయనగ జాహ్నవి క్రుంగిడి లేచు లోపలా / నాతులు మీసముల్దనరి నవ్వత జూపరె పూరుషార్భటిన్

సభలో : కరతాళన ధ్వనులు

తిమ్మరసు : ప్రభువులు రాజకవి శేఖరులు కూడను

రాయలు : అప్పాజీ ! ఇప్పుడు మిగిలియున్నది మీరలు. కాచుకొనుడు. ఇదే సమస్యను ప్రస్థుతార్ధముగా పూరించుడు

తిమ్మరసు : అటులనే వినిపించెదను ప్రభూ !

నూతన శోభతో జరుపు నుత్సవమయ్యెదిరాజధానిలో / కాతర మాకు లేదనుచు కాంతలు వేసిరి వేషముల్ భళీ

ఆతరి వేసముల్ గనగ ఆహవ వీరుల బోలియున్నయా / నాతులు మీ – సముల్దనరి నవ్యత జూపరె పూరుషార్భటిన్

రాయలు : ఆహాహా అమాత్య శేఖరా అప్పాజీ ! మీరలు ఖడ్గమునే కాదు, కలమును గూడను బాహాటముగా ఝుళిపించుట

చూచుచున్నారము

తిమ్మరసు : మహా ప్రభూ ! కలము పట్టుటె మొదటిది ఖడ్గమిపుడ / తంత్ర మంత్రాంగ విద్యలంతమకు తోడ

నేర్వకెటులుండగలడ నెరితనంబ / **<u>నెనర బుట్టిన నియోగి నేన గాన</u>** (రచయిత)

అష్టదిగ్గజ కవులు : అమాత్యశేఖరులు అమోఘ యుద్ధ విశారదులేకాదు విద్వత్ కవి కులాలంకారులు గూడను ప్రభూ !

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : ప్రభువులు భువన విజయ కవి పండిత దిగ్గజముల కెల్లరకును లక్ష వరా తాంబూల పళ్లెరముల నొసంగుచున్నారు గ్రహింపుడు

దిగ్గజములు : మహా ప్రసాదము (వచ్చి గ్రహింతురు)

తిమ్మన : శేషసుభాషణ శీల విభీషణ సేవక పోషణ చిత్తరిపూ / నైషణివర్తన నిర్మల కీర్తన నిత్య సువర్తన నీతికళా

పోషవిచక్షణ పుణ్యవిధిక్షణ భూసుర రక్షణ భూరి నుతా / ద్వేషణ శాసన ధీజలజాసన దీప్తివిభాసన ధీరమతీ

సభలో : శ్రీకృష్ణరాయ సార్వభౌములకు జై ! విద్వత్ కవి రాజ చంద్రులకు జై !

--------------

# షష్ఠమాంకము

## సభాప్రాంగణము – నిమషకవి వేతాళభట్టు రాక

దౌవారికుడు : (వచ్చి నమస్కరించుచు) ప్రభూ ! ఇరువురు పండితులు కాబోలు వచ్చియున్నారు.(లేఖను ఇచ్చును)

తిమ్మరసు : (లేఖను చూచి) నిమషకవి వేతాళ భట్టు పండితులా ! ప్రవేశపెట్టుము

దౌవారికుడు : చిత్తము ప్రభూ ! (వెడలును)

వేతాళ భట్టు : (సభలోనికి వచ్చుచునే) జయము మహారాజా జయము.

శీతల సత్య భాషణ విశేష విలాస జనాను రంజనా / ఆతత గర్వభంజన దయామతినేలెడు వీరసత్తమా

నీతి కళానిధీ విపుల నేర్పరి వెంతయు యుద్ధవిద్యలం / సీత నగాధిరాజ సుతచెల్వుడు ప్రోచుత కృష్ణరాయనిన్

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : పండితోత్తమా రండు. ఆశీనులుగండు. మీరాక ప్రభువులకు విన్నవించుకొండు

వేతాళ భట్టు :

ప్రభూ ! నా పేరు వేతాళ భట్టంద్రు. మా యింటి పేరు నిమష కవి అంద్రు. ఇతడు మా శిష్యుండు రామభట్టంద్రు దక్షిణాది ప్రాంతమందుంద్రువారము. 'కవి ఘంటానన' బిరుదాంకితుండ. బహుముఖ ప్రజ్ఞాధురీణుండ. కాశీ ఉజ్జయినీ పండితుల శిష్యుండ. శ్రోత్రియుండ.అనేకానేక జయ పత్రములందుండ. మీ ఆస్థాన ప్రఖ్యాతులు వినుండ. ఇటు వచ్చుండ.

రాయలు : ఓ హెూ హెూ అట్లుండ మా దిగ్గజములతో ఢీకొనుండ వచ్చుంద్ర

వేతాళ భట్టు : ప్రభువుల సెలవుండ. అట్లుండ వచ్చుండ

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : అంతయు సిద్ధమే ప్రభూ !

దిగ్గజములు : మేమును సిద్ధమే ప్రభూ !

తిమ్మరసు : (వేతాళ భట్టుతో) ఆర్యా ! తొలుత తమరు ఉపక్రమింతురా

వేతాళ భట్టు : తమ సెలవుండ అట్లనే ప్రభూ ! 2, 3 విషయములు మాత్రమే వినుండు

- ఈశ్వర నందీశ్వరులం బోల్చి చెప్పుండ
- అప్ప కంటె పెద్దదగును చెల్లి. (పురాణార్ధముగానూ, ప్రస్థుతార్ధముగానూ చెప్పుండు)

- నీటనుండు కొన్ని నీలి పద్మములందు / తుమ్మెదొకటి వంతు నెమ్మి వ్రాల
  తుమ్మెదొకటి మిగులు దొందు దొందును వ్రాల మిగులు పద్మమొకటి మేటి చెపుమా

రాయలు : ఇవియే కదా మీ ప్రశ్నాంశములు. యింకను యేమైనా యున్నవా ?

వేతాళ భట్టు : ఇంతకు చాలును ప్రభూ ! చెప్పగలిగుండ

రాయలు : ఆంధ్రకవితా పితామహా అల్లసాని పెద్దన కవీంద్రా ! వీరి ప్రశ్నలకు సరియగు సమాధానములు ఎవరెవరిని చెప్పమందురో నుడువుడు.

పెద్దన : అటులనే ప్రభూ ! రామలింగ కవీ ! రామకృష్ణ కవీ ! మీరు మొదటి ప్రశ్నకుత్తర మిండు

రామలింగడు : అటులనే పెద్దన కవీంద్రా ! ప్రభూ ! ఈశ్వర నందీశ్వరులం బోల్చిచెప్పుటయా?(ఒక్కతడవాలోచనగా కనులు మూసికొని)

ఇతడు శూలము ద్రిప్పు – అతడు వాలము దిప్పు / ఇతడు అమ్మున నేయు – అతడు కొమ్మున నేయు

ఇతడు అంబకు మగడు – అతడు అమ్మకె మగడు / వాడ వాడల దిరుగితడు – బీడు బీడుల దిరుగతడు

రక్షణ దక్షుడీతండు – భక్షక కుక్షియాతండు / దేవుడీతడు – కుడితంత దేవునతడు

సభలో : కరతాళన ధ్వనులు

రాయలు : భేష్ భేష్ రామకృష్ణ కవీంద్రా ! వికట కవులన జెల్లుదురు. ఇక సమస్య. **అప్ప కంటె పెద్దదగును చెల్లి.**

పెద్దన : దూర్జటి కవి సత్తమా మీరు పురాణార్ధముగానూ, రామరాజ భూషణులు ప్రస్థుతార్ధముగానూ పూరింతురు.

దూర్జటి : (ఒక్కతడవాలోచించి)

పుట్టు చేత చిన్న పట్టపు దేవిగా / వాసికెక్కె యిలను భాసిలంగ

విష్ణుపత్ని ఆహాహా విభవంబులన్నింట / అప్ప కంటె పెద్దదగును చెల్లి

(2 సార్లు చదువును)

రా రా భూ : పట్టి చూడ లుడితె దిట్ట తనము గల్గి / ఆట పాటలందు మేటియగుచు

బూటకంబు పల్కి మూటగట్టుట లోన / అప్ప కంటె పెద్దదగును చెల్లి
(2 సార్లు చదువును)

రాయలు : భేష్ భేష్ చక్కగా పూరించితిరి. ఎటులైనను సమర్ధులే

పెద్దన : 3 ది తిమ్మనగారు నుడివెదరు

తిమ్మన : మూడు పద్మములౌనుగా ముదము గూర్ప / నాల్గుతుమ్మెదలవురయో నాకుదెలసి

లెక్క చెప్పిన వితముగా ఒక్కటొకటి / మిగులుచుండును చూడుమో మేటి వర్య !

రాయలు : తిమ్మన కవీంద్రా ! భేష్ భేష్. అప్పాజీ !

తిమ్మరసు : ఆర్యా ! వేతాళ భట్టు పండితోత్తమా ! మా వారిక మిమ్ముల బరీక్షింప వచ్చునా ?

వేతాళ భట్టు : చిత్తము అడుగుండు ప్రభూ !

రాయలు : పెద్దన కవీంద్రా ! మీరలొక గణక సమస్యనిండు

పెద్దన : అటులనే ప్రభూ ! పండితోత్తమా వినుండు

మూడుగళ్ల చదర మూసందు తగునట్లు / తొమ్మిదంకెలందు నెమ్మి వ్రాసి

అడ్డ నిలువు మూలలందెట్లు గూడిన / ఒక్కలాగె వచ్చు లెక్క చెపుమా ?

వేతాళ భట్టు : (ఒక్కతడవాలోచించి)

ఆరున్నొక్కటి యెనిమిది / సారసముగ నేడునైదు సరగున మూడున్

దీర్ఘముగ రండు తొమ్మిది / శ్రీరామా కడకు నాల్గు సీతారామా

రాయలు : దిగ్గజచంద్రమా వీరలసామాన్యులు.

దిగ్గజములు : చిత్తము. అటులనే అగుపడుచున్నారు ప్రభూ !

తిమ్మరసు : దిగ్గజచంద్రమా ! వినుండు. కవి గంటానన బిరుదము వలననే వీరు చెప్పునంతలోనే వ్రాయగలవారలనియును యింటి పేరును బట్టి నిముసము లోనే ఏదేనీ కవన మల్లగలరనియును తేట పడుచున్నది. గ్రహించితిరా?

వేతాళ భట్టు : అవుండ ప్రభూ ! నిముషము దాటకుండగనే చెప్పినది చెప్పినట్లుగనే వ్రాయ గలుండ. పరీక్షింప వచ్చును

పెద్దన : గ్రహించితిమి ప్రభూ ! తిమ్మనార్యా !

తిమ్మన : తొలుతనే మనమెందులకు పెద్దనార్యా ! మనలో చిన్న వాడును, చురుకైన వాడును రామలింగకవి చాలడా ?

రాయలు : నీవే చిన్నవాడవయ్యా. రామలింగ కవీంద్రా ! వీరినెటుల గట్టెక్కింతువో

రామలింగడు : చిత్తమటులనే ప్రభూ ! తొలుత వ్రాత పరీక్ష. తదుపరి తదుపరి

రాయలు : అటులనే కానిండు

రామలింగడు : 'కవి ఘంటానన' బిరుదాంకిత వర్యా ! వ్రాయ సిద్ధముకండు

త్ర్ృవ్వట బాబా, తలపై / పువ్వట జాబిల్లి , వల్వ బూదట, చేదే

బువ్వట జూడ హుళ హుళ / క్కవ్వట అటువంటి శంకరయ్యకు జేజే

వేతాళ భట్టు : (అటునిటు చూచుచు) అయారే ! ఏమిది గంటమూని వ్రాయుటకే వలను పడకున్నది.

ఏమి యీ కవి కుంజరుని అమోఘవాగ్విలసన శబ్దపల్లవ పాటవ నైపుణీ పాండిత్య ప్రకటిత

విశిష్ట వాగ్ధరీణ చాతురీ గరిమంబు. మచ్చునకైనా కనీ వినీ ఎరుగనిది. (రామలింగ కవినే చూచుచుండును)

రామభట్టు (వేతాళ భట్టు శిష్యుడు) : గురూత్తమా ! ఆదిలోనే హంస పాదు. ఎటుల ఈ అవమానము సైచుట.

ఎందులకొచ్చిన బిరుదములు

వేతాళ భట్టు : చుర చుర చూచుచు (శిష్యుని వైపు) తలవంచుకొని ప్రభూ ! తమ భువన విజయ కవి దిగ్గజములముందు

తల వంచక తప్పుట లేదు

పెద్దన : కవి సత్తమా ! పరాజయ మంగీకరించినను, మీరును తక్కువ వారు కారు. దయచేసి సభాస్థానమలంకరింపుడు

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : రామలింగ కవీ ! వేతాళ భట్టు పండితోత్తమా ! మీకివే రాయల వారి సన్మానములు. స్వీకరింపుడు

(2 సన్మాన పళ్లెరములు వచ్చును)

వేతాళ భట్టు : 2 సన్మానములకును మీరే అర్హులు రామలింగ కవీంద్రా

తిమ్మరసు : రాయలవారొసంగునవి ఎవరికి వారే స్వీకరింపనగు. తప్పదు. స్వీకరింపుడు

వేతాళ భట్టు : (అందుకొనుచు) సాలంకృత వేయిన్నూర పదారు దీనార పళ్లెరమా ! ధన్యుడను ప్రభూ ! ధన్యుడను

ప్రభువులు దయార్ద్ర హృదయులు. జయోస్తు

రామలింగడు : (అందుకొనుచు) రత్నాల హారమా ప్రభూ ! ధన్యుడను. అక్షర లక్ష వరాతాంబూల పళ్లెరము గూడనా !

ప్రభువులు వదాన్యశేఖరులు. జయోస్తు. దిగ్విజయోస్తు.

రాయలు : కవి శిష్యులకు గూడను

శిష్యుడు : గురువులతో పాటు శిష్యులకు గూడనా ప్రభూ ! ధన్యుడను

భువన విజయ రాజ భోజ భూపాల తేజ / కవిజనాశ్రయ పోష కామితార్థ ప్రతోష

ప్రభువులకు జయీా భవ. విజయీాభవ. దిగ్విజయీాభవ.

-------------

## సప్తమాంకము

### గోవింద పండితారాద్యుని రాక – సభాప్రాంగణము

దౌవారికుడు : (వచ్చి నమస్కరించుచు) ప్రభూ ! ఎవరో పండితులు కాబోలు వచ్చియున్నారు.(లేఖను ఇచ్చును)

తిమ్మరసు : (లేఖను చూచుచు) గోవింద పండితారాద్యులా ప్రవేశపెట్టుము.

దౌవారికుడు : చిత్తము ప్రభూ ! వెడలును

తిమ్మరసు : (వచ్చువానిని చూచుచు) గోవింద పండితారాద్యా ! దయసేయుడు

పండితారాద్యులు : ప్రభువులకు అభివాదనములు. నమస్కరించును

శ్రీకృపా ధౌరేయ శ్రీకృష్ణరాయ / శాంతి దాంతులు నిల్పు సమయజ్ఞ ధీర

ధర నేల దగుదయ్య దాక్షిణ్య హృదయ / కవిరాజ చంద్రమా ! కారుణ్య ధామా ! జయోస్తు. విజయోస్తు.

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : కవి వర్యా ! మీకివే రాయల వారి కానుకలు. (చిన్న మూట నిచ్చును). గ్రహించి వివరములు విన్నవించుకొండు

పండితారాద్యులు : (గ్రహించుచు) వరాల మూటయా . ప్రభువులు కరుణా సముద్రులు

ప్రభూ ! మా యింటి పేరు ఉద్దండం వారు. నా పేరు పండితారాద్యుడు. వేదాంతోపదేశకుల శిష్యుండ.

'వ్యాఖ్యానశిరోమణి' , 'భావప్రకాశ ' బిరుదులందినవాడ. కంచి, మధుర, మాయ, గద్వాల, మైసూరు

మొదలగు రాజాస్థానములలో వేదాంతోపదేశ వ్యాఖ్యానములు సల్పి భావ వివరణలిచ్చి యెన్నియో జయ పత్రములందినాడ. మీ భువన విజయ ఆస్థాన పండిత శక్తి సామర్ధ్యముల విని వచ్చినాడ.

రాయలు : అయిన మా పండిత కవి దిగ్గజములతో వేదాంత విషయములు ప్రసంగింప వచ్చిరన్న మాట

పండితారాధ్యులు : ఔను ప్రభూ ! ఔను

రాయలు : అప్పాజీ ! పెద్దనా మాత్యా ! అందరును విన్నారు కదా !

దిగ్గజములు : విన్నారము ప్రభూ ! విన్నారము. సిద్ధముగా యున్నారము.

తిమ్మరసు : పండితోత్తమా ! (పండితారాధ్యులవైపు చూచుచు). తొలుత తమరే ప్రసంగింతురా?

పండితారాధ్యులు : ప్రభూ ! తొలుత తమ పండితులనే ప్రసంగింపనిండు.

పెద్దన : పండితారాధ్య వర్యా. మా పండితులు ఒకటి రెండు విషయములు మీముందుంతురు. వాటికి మీరు సరియగు భాష్య, భావములు వివరించి చెప్పవలయు

పండితారాధ్యులు : అటులనే ప్రభూ !

దూర్జటి : (ముందునకు వచ్చి) వేదాంత వ్యాఖ్యాన శిరోమణీ పరికింపుడు

గాలిలో పెద్ద సున్నగా జుట్టి, హస్తముద్రగా ఐదు వేళ్ల చూపుచూ, సర్వము అను నట్లు రెండు చేతులతోను వలయాకారముగా చేతులు త్రిప్పి. దీని భావ మేమి తెలియ చెపుమా? (మరల చెప్పును)

రామలింగడు : మేక మెక మేక తొక తోక మేక తోక / తోక తొక తోక మెక మేక తోక మేక

తోక మెక తోక తొక మేక తోక మేక / మేక తొక మేక మెక తోక కుక్క తోక

పండితారాధ్యులు : మరల వినిపింపుడొక మారు (అని అడుగును)

దూర్జటి, రామలింగడు : మరల చెప్పుదురు

పండితారాధ్యులు : (విని విని ఆలోచింపుచు యేమీ పాలు పోక) అటు నిటు దిక్కులు చూచుచుండును.

పెద్దన : ఏమి పండితారాధ్య వర్యా ! అట్లాలోచనా ముద్ర వహించి మిన్నకున్నారు. యేమియు పాలు పోకున్నదా యేమి ?

పండితారాధ్యులు : (తడబడుచు) ఆలోచించుట కేమున్నది. ఇందేవొక్కటి యును వేదాంతమును కాదు, కవిత్వమును కాదు. అర్ధవంతములును కావు. అర్ధ భావములు ఉండెనేని వివరింప మనుదు చూతము

పెద్దన : వివరించి చూపినచో

పండితారాధ్యులు : ఓటమినంగీకరించి నా బిరుదు ప్రదానములు విసర్జించువాడ

రామలింగడు : తెలియనివన్ని తప్పులని దిట్టదనాన సభాంతరస్థలిం / పలుకకుమోరి గొప్పలుగ పాడియగాదు వినీతిహేతువౌ

పలుచన కాక మున్నె తగ పర్విడు పారక యున్న దోషిగా / నిలువగ బెట్టగల్గుటది నిక్కము నిక్కము పండితాధమా

పండితారాద్యులు : బిత్తర పోవును

తిమ్మరసు : కవి దిగ్గజములారా ! మీ మీ విషయములకు సరియగు ఆయాయా అర్ధ భావములు ప్రభువులకును, సభకును ప్రస్ఫుటము గావించి ప్రభువుల ప్రజల మన్నన లందుడు

దూర్జటి : శూన్య పూర్ణంబులు సున్నలో రూపొందు / వేదాంత తత్వంబు విబుధ వర్య
సందేహ శూన్యంబు సంపూర్ణ తేజంబు / పంచ భూతాత్మ్య మై బరగు సృష్టి
అర్ధ భావములు వినుడు. సున్న యనగా యేమియు లేనిది. సర్వ శూన్యము. సున్నయనగా పరి పూర్ణమైనది. సంపూర్ణజ్ఞానము. పర బ్రహ్మము. తెలియనివారికీజగత్తంతయు సున్న. మాయ. మిధ్య. తెలిసిన పండితులకును విజ్ఞులకును పరబ్రహ్మ స్వరూపమైన నిండు జగత్తు. ఇదంతయును పంచ భూతాత్మికముగా నడచుచుండును.

రామలింగడు : ఇది ఒక మేకల మంద వర్ణన. మందలో ఎన్ని మేకలుండునో అన్ని తోకలుండును. మేక కొక తోక, తోక కొక మేక వెన్నంటి నడచుచుండును. ఆఖరున మందను కాచేటి కుక్క గూడ యుఒడును. ఇట్టిది బహు భాషా విషయ పరిజ్ఞానులకును పండితులకును తప్ప అన్యులకు, అల్పులకు అలవి కాని కవన రీతి. ఆశువుగా ఇట్టిది ఒక్క మహా కవులు మాత్రమే చెప్పగలరు. అన్యులకిది అసాధ్యము. పై పద్యమున ఎన్ని మేక శబ్దములున్నవో అన్నియే తోక శబ్ద ములును కలవు. పరికించి చూచుకొనుడు కుక్కతో కలిపి.

పండితారాద్యులు : ప్రభూ ! మీ దిగ్గజకవి పండితుల ముందు ఓటమి నంగీకరించు వాడ. (తలవొంచుకొనును)

పెద్దన : ఆర్యా ! అంత మాత్రమును చాలును. మీ బిరుదు ప్రదానములు మీరే యుంచుకొనుడు

రాయలు : అప్పాజీ !

తిమ్మరసు : భువన విజయ కవిదిగ్గజములారా ! సభాసదులారా ! మన ప్రభువులు మన పండిత కవిదిగ్గజములకు నేటి సభాకానుకలుగా ఒక్కొరికొక లక్ష వరా తాంబూల పళ్లెర ప్రదానము గావించుచున్నారు. వచ్చి గ్రహింపుడు.

దిగ్గజములు : ధన్యులము ప్రభూ ! ధన్యులము (గ్రహింతురు)

పెద్దన : శ్రీకృష్ణ పద ధ్యాన చింతచే సంపత్తి / సంపత్తిచేగల్గు స్వర్గ సుఖము

తిమ్మన : సుఖ సిద్ధిచేత విస్తృతమొందు శౌర్యంబు / శౌర్యోజ్వలన చేత చతుర నీతి

రా భూ : నీతిపెంపున మహనీయ శాంతిదనరు / శాంతిని నొప్పునా సద్గుణంబు

ధూర్జటి : సద్గుణ గరిమచే సామ్రాజ్యసంవృద్ధి / సమవృద్ధిచే నొప్పు సాధుశీల

మల్లన,సూరన : శీలసత్కృ పా విలసన స్నేహ పాత్ర / అవని సాటేరి దలపింప ఆంధ్ర భోజ

రా భ, తె రా : దాన వితరణ ధౌరేయ తావకాంఘ్రి / జగతిగొల్చి వసించు టేజన్మ ఫలమొ !

సభలో : శ్రీకృష్ణ దేవరాయ సార్వభౌములకు జయీభవ ! అష్ట దిగ్గజ కవి పండితులకు విజయీభవ !

భువన విజయ ఆంధ్రావనీమ తల్లికి దిగ్విజయీభవ !

మంగళం మహాత్ శ్రీ శ్రీ శ్రీ

-------------